చేతను, ప్రాథమికవిద్యకై వ్యయపరుపబడుచున్న పద్దులలో మార్పులు జరుగుటచేతను తీరిపోవును. మన రాష్ట్రములోని ఒకభాగము విద్యాభివృద్ధికొరకు ఏర్పాట్లులేని జాగీరు మొదలగు స్థలములుగా గలవు. ఏర్పాట్లున్నను ప్రశంసనీయములుగాలేవు. కావున నిర్బంధప్రారంభవిద్యకైవలయు పద్దులలో ఒకభాగము భారము జాగీరులపై వేయవచ్చును.

సంస్థానాధీశ్వరులు, జాగీరుదార్లు తమప్రజలపై పన్నువసూలుచేయుట మొదలగుహక్కులుకలిగియున్న రైతులఅభివృద్ధికి తాముసహాయము చేయవలసియుండును. కాబట్టి వ్యయములోని ఒకభాగము జాగీరుదారులు మరియు సంస్థానాధీశులనుండి పొందవచ్చును. దేశాభ్యుదయమే ప్రధానమని జాగీరులోని అభ్యాసవ్యవహారమునుకూడా తాము శాఖగా నేర్పరచుకొని ఏర్పాట్లుగావించినప్పుడు రైతుశ్రేయస్సుకై ఏర్పడిన ఈనిర్బంధప్రారంభవిద్యకై ఏర్పాటుగావించుటలో జోక్యముకలిగించుకొనవచ్చును.

ఈరాష్ట్రములోని ప్రతిపట్టణ పురపాలకసంఘము లేర్పడి స్థానికులనుండి పన్నులువసూలు చేయబడుచున్నవి. గాని పైసంఘముపారిపాలన హద్దులలో మరియు లోకల్బోర్డువారి పరిపాలనహద్దులలో నియమింపబడు నిర్బంధ విద్యాపాఠశాలల వ్యయములు కొంతవరకు పైసంఘములనుండి పొందవచ్చును. ఇదియునుగాక అవసరమనితోచిన పట్టణములలోని పాఠశాలకుకూడా ఆయాహద్దులలో గల పౌరులనుండి విద్యాపన్ను మోపవీలగును. పల్లెటూళ్లనుండి భూమిపన్నురూపకముద్రవ్యమును ప్రభుత్వమునకొక చిల్లిగవ్వకూడా ఆదాయపుపన్ను చెల్లించనివారికై పట్టణములలో విద్యాశిక్షణముక్రింద వ్యయపరుపబడుచున్నపుడు రైతుక్రింద నేల వెచ్చింపకూడదు? అట్లనుచో ఏమైననుపన్నుభారమున్న, పట్టణవాసులను లేటు సాహుకార్లు వర్తకులు, జాగీర్దారు, జమీందార్లు, అధికవేతనము లపొందు అధికారులకు మాత్రమే యుండును. కావున, పల్లెటూరిరైతులిసుమంతయు భీతిజెందవలసిన అగత్యములేదు. ఒకవేళ పైవిధానములపైరాబడురొక్కము సరిపోక, విధిలేక రైతులనుండికూడా పన్నువిధించవలసివచ్చినను, సైన్యవ్యయములనిమిత్తము పన్ను ఇచ్చుచున్న రైతు ఈనిర్బంధ ప్రారంభవిద్యకై చెల్లించుపన్ను భారమనితలపక తన సంపూర్ణాభిప్రాయముతో తనబాలురవ్యయముల భరించుటలో వెనుతీయుడు.

“అరువేండ్లలో విద్యాశిక్షణజరిగినను జరుగనిదానితో సమానమే”నని ప్రతికూలుర వాదనఅభిప్రాయము. ఈ ప్రతిఘటన పైకిసవ్యమని తోచుచున్నది. కాని, వాస్తవిగా విద్యావిహీనుడగుటకంటె కొంచెము తెలసినవాడుగానుండుట మేలని వ్యాప్యర్యుత్తరము. సహకారశాఖవారును మరియు వ్యవసాయశాఖవారును జోక్యము కలిగించుకొనిన యువకులు విద్యాశిక్షణములోకూడా జయముపొందగలరు. యువకులగువారు రాత్రిసమయములందు ప్రతిరోజు శిక్షణపొందుచున్న, పిన్నవయస్కులగువారికంటె చురుకుగా తమవిద్యను వృద్ధిచేసుకొనగలరు. ఇదియునుగాక పత్రికాపఠనము చేతను, గ్రంథపఠనముచేతను వీరు మరింతవృద్ధి గాంచగలుగుదురు. దీనినే “పురోభివృద్ధి” అనియు వ్యవహరింతురు. పురోభివృద్ధినిగురించి నిజాం ప్రభుత్వమునకేగాక నిజాం ప్రభుత్వ రాజ్యానికిగల ప్రజ్ఞవర్గవాసులకు. ప్రభుత్వమువారు చేయుచున్నకృషికి ప్రశంసార్హ్యమైనది. వారికి చేసినొక్క కృత్యము బోధపరచవలసియున్నది. ప్రారంభవిద్యకు వ్యతిరేకముగాను పురోభివృద్ధికకూడా వ్యతిరేకులని కొందరు గుసగుసలాడుచున్నారు లేదు. అనగా ప్రస్తుత హీనస్థితియందున్న మనరాజ్యమును అభివృద్ధిపరచవలెనని వారి అభిప్రాయమన్నమాట. ఇట్టివారి అభిప్రాయములని నేను నిరూపించినదానికి “నిర్బంధప్రారంభవిద్యావిషయము పైఆలోచించుటకుగాను ఏర్పరచిన ప్రభుత్వసబ్కమిటీవారు బహిరంగపరచిన తమ అభిప్రాయము (సిఫార్సు)లను పరిశీలించుటకు సీలువదతులు ౧౩౪౫ సంవ

లతార్కాణము, అనగా ఒకతీరమునకు అర్థిక పరిస్థితులే శాశ్వతముగానుండుట వారి అభిమతమనుటలో సందియములేదు. ఇప్పటిపరిస్థితులు హీనదశలో నున్నవని వర్తమాన పరిస్థితులు తెలిసికొనగల్గుకొందరు ప్రముఖులు తమ స్వదాభిప్రాయముల వెలిబుచ్చిరి. ఇకమీదట సంభవించు విషమపరిస్థితులుకూడా నెరింగియున్నారు. ప్రజానుకూలముగా, సౌఖ్యదాయకముగా నుండకోరుట ప్రభుత్వమువారి బాధ్యతయా? లేక హీనస్థితియు; అపారిశుద్ధ్యము, ప్రపంచములో అపకీర్తిసంపాదించుటకు తోడ్పడుటయా? అను నొక ప్రశ్న ప్రతివారికిని జనించకమానదు. ప్రభుత్వములు కేంద్రస్థానమలంకరించినవి, కాని బ్రిటిషు పరిపాలనావిధానములలోగాని, కాలపరిస్థితులలోగాని, సాకర్యములయందుగాని ఇసుమంతయు వ్యత్యాసము కలుగకపోవుటను, యూరోపు ఇతరదేశీయ సంస్థానములలోని కూలీలకంటె బ్రిటిషు రాజ్యములోని కూలీలు మిక్కిలసంతోషముగను, దృఢాభిప్రాయము గలవారుగనుండి చలనము లేకయుండుటయే కారణము.

ప్రపంచచరిత్రనేగాక తమ స్వరాష్ట్రచరిత్రనుకూడా మిక్కిలి సూక్ష్మదృష్టితో ఆసాంతముగా పఠనము గావించవలసియున్న వీరు జీవితవిధానముపై ఆధారపడియున్న ఇట్టి ముఖ్యమగు సమస్యలలో పాల్గొనుటకంటె ప్రపంచము మరియుతమ జన్మస్థానముయొక్క ఆర్థికపరిస్థితులలో అనుభవము కలిగించుకొనినంత పాల్గొనవలెను.

ప్రారంభ నిర్బంధవిద్య అమలునకుతెచ్చుట లేకపోవుట అనువిషయమును మేము చర్చించుటలేదు: కాని మొత్తము రాజ్యములో (Mass Education) విద్యావిషయమై తగు ఏర్పాట్లు గావించబడి, విద్యావిహీనుడనుపేరును తుడిచివేయ కృషిసలుపవలయునని మా ప్రత్యేకకోరిక.

## కావలయును

విక్టోరియా మెమోరియల్ ఆర్ఫనేజ్ అండ్ టెక్నికల్ స్కూలు, సరూర్ నగర్, కొరకు ఒక హౌస్ మాష్టర్ హాలీ 30-3/2-60 వేతనముపై బాలురకు స్కౌటింగు ఆటలు మొదలగువాని నేర్పగలవాడై యుండి వివాహితుడైనవాడై యుండవలెను.

దరఖాస్తులు 7 వ అబాన్ 1346 ఫ. (12 వ అక్టోబరు 1936) తారీఖువరకు సూపరింటెండెంట్ కు స్వయముగా నియ్యవలెను. సి. యి. యల్కిన్స
సూపరింటెండెంటు.

## కలరా కలరా కలరా

భయములేదు. భీతిజెందకుడు.

కలరాకు దివ్యౌషధము

**విక్టర్ డ్రాప్స్** మిమ్ము కాపాడగలదు.

గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము, వాంతిభేదులు మొదలగువానిని తప్పక కుదుర్చును. రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరా వలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును. అనేకులు మా విక్టర్ డ్రాప్స్ను ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రముల నొసగియున్నారు. కలరా వ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మా విక్టర్ డ్రాప్స్ ప్రశస్తమైనదని డాక్టరులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికిని నిర్భయముగా వాడవచ్చును.

ఏజెంట్లు: విక్టర అండు కో
పత్తరగడి మూరం హైద్రాబాద్ దక్కన్
దవాఖానా, విక్టర్ అండుకో
సుల్తానుబజారు

AGAINST
**diabetes mellitus**
**LOBULINA**

The World's most efficient Anti-Diabetic Specific. The Product of Swiss Serum & Vaccine Institute, Berne, Switzerland. If your Chemists do not have stock of LOBULINA send your order direct to the Sole Representative,

**DR. JEAN F. STRANDGARD,**
**DIABETES EXPERT,**
**BANGALORE.**

స్విట్జర్లండు దేశములో ప్రపంచములోకెల్ల ప్రసిద్ధిచెందిన స్విస్ సిరం అండు వాక్సిన్ యిన్స్టిట్యూట్, బెర్ను వారివల్ల తయారుచేయబడిన "లోబులీనా" అను అతిమూత్ర నివారిణి.

అతిమూత్రములో మెలిటస్ అనువ్యాధికి యిది సాటిలేనిదని ప్రముఖులైన అతిమూత్ర వ్యాధి చికిత్సకులచే అభినందించబడి వాడబడుచున్నది. ఇప్పుడు నేను ఇండియా మొత్తములో అతిమూత్ర వ్యాధులకున్ను, రక్తవృద్ధికిన్ని చికిత్సలు చేయుచున్నాను. దీనికి నేను "లోబులీనా"కే ఋణపడియున్నాను.

ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులో
డాక్టరు జీన్ యఫ్. స్ట్రాండుగార్డు
అతిమూత్రవ్యాధికి స్పెషలిస్టు.
బెంగుళూరు

## ప్లేగు చికిత్స

ప్లేగు ఎందుకు వ్యాపించునో మీకు తెలియునా?

1. ఇంటియొక్క అనారోగ్యత
2. ఆహారపదార్థముల నజాగ్రతగాయుంచుటవలన అవి చీమలు, ఎలుకలపాలగును
3. బట్టల నజాగ్రతగా యుంచుటు పారవేయుటవలన పురుగులుపట్టును.

వీనినుండి రక్షించుకొనుటకు, 56, 8577 A. జేమ్సుస్ట్రీట్ మరియు 1415 జనరల్ బజారు సికింద్రాబాదులోయున్న మా ప్రదర్శనశాలలకు రండు. ధాన్యము భద్రపరచుటకు గాలి దూరని డబ్బాలు, ఉక్కుసూటుకేసులు, ట్రంకులు, యింకా యితర ఉక్కు సామానులు సరసమైన ధరలకు దొరకును.

**ది దక్కన్ మెటల్ వర్క్సు**
8755. జేమ్సుస్ట్రీట్
సికింద్రాబాద్ దక్కన్.

GRAMOPHONE SHOWROOM
JAMBAGH
B. G. CHIMA

ఫోను రికార్డుల భవనము

అన్ని రకముల తెలుగు గ్రామఫోను రికార్డులు మావద్ద దొరకును. స్త్రీలువచ్చి చూచుటకు ప్రత్యేకమగు ఏర్పాటుగలదు.

బి. జి. చిమల్
జాంబాగు, హైద్రాబాదు దక్కన్,

## కృష్ణా టాకీస్ గుల్జారుహౌజు

రెండు అమూల్యానకాశములు
మిస్. గుల్ జారు, మిస్. ఫాతిమా, నటునరాంధ్ర నృత్య గానములు

**సాగర్ కన్యా**

విఖ్యాతచిత్రము—కళావైదుష్యమునకు నరవుతాయి.

రాబోవు చిత్రము—
**హరిశ్చంద్ర**

## సెంట్రల్ టాకీస్ గౌలిగూడ

రెండవ వారము
24 గురువారము మొదలు మినర్వ ఫిలింకంపెనీవారి ప్రసిద్ధ చిత్రము

**సైడే హవస్ (King John)**

సోహరాబ్ మోదీ, చంద్రకుమార్, సాదత్ అలీ, షామ,
గుల్ జార్, మిస్, మహబూబ్ జాన్ గానము (రేడియో పాటకురాలు

రాబోవు చిత్రము—
**బన్ సరి బాల**

## రీగలు టాకీసు సికింద్రాబాదు

(పూర్వము రామగోపాల్ థియేటరు)

**ముజ్రా 1935**

ప్రదర్శింపబడుచున్నది.
అమీర్ బేగం, ముక్తార్ బేగం, మిస్. షామ, సుల్తాన్ బేగం

రాబోవుచిత్రము—
**ఆఫత్ ఖు అబల**

## వెస్టెండు టాకీస్

3 అద్భుత ప్రదర్శనములు
3 అక్టోబరు శని, 5 సోమ, 7 బుధ.
అఖిలభారత విఖ్యాత గాయకురాలు
శ్రీమతి హీరాబాయి
బరోడ్కర్
మధురగాన ప్రదర్శనములు.

8 గురు. చార్లిన్ సిటిలైట్సు
13 మంగళ. Afrca Speaks

## రాయల్ టాకీస్

సెప్టెంబరు 26 శనివారము మొదలు
మహాలక్ష్మి సినీటోన్ వారిచిత్రము

**బాంబు—షెల్**

భయానక చిత్రము
మిస్. కృష్ణ. మిస్. లక్ష్మి
మాస్టర్, అనంతదేవు.
హాజి (షాపీకిమర్ షే)




# గోలకొండ పత్రిక

ధాతనామ సం॥ర నిజభాద్రపద బ॥ ౧౯

సోమవారము


## క్రీ. శే. డాక్టర్ మెకంజీ గారు

మన ఉస్మానియా విశ్వవిద్యాపీఠపు ప్రొవైస్ ఛాన్సెలరు అగు డాక్టరు ఏ. హెచ్. మెకంజీగారు కీర్తిశేషులగుటచే ఉస్మానియా విశ్వవిద్యాపీఠము మన రాష్ట్రము వెలుపల తన ప్రతిష్ఠను వృద్ధిచేయుట కుద్యమించుచున్న ఒక ఆప్తుని గోలుపోయినదైనది. మెకంజీగారు ఉస్మానియా విద్యాపీఠమునకు రాకపూర్వము, నేటికిని మన దేశవాసులచే గొప్పవిగా నెంచబడు బ్రిటిషు దేశపు విశ్వవిద్యాపీఠముల డిగ్రీలనుపొంది, క్రీ. శ. ౧౯౦౮ నుండియు మన భారతదేశమందు సంయుక్త రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖలో అనేకములగు అధికారపదవులను, తర్వాత కొన్ని కాలము అనలువారికి బదులుగా భారత ప్రభుత్వవిద్యాశాఖాధికారిపదవిని ఆయా ప్రభుత్వములకు చాల సంతృప్తికరముగ నిర్వహించియుండెను. వారు అవసానకాలమునకు ముందు జబ్బుపడి ఉస్మానియా విశ్వవిద్యాపీఠపు ప్రొవైస్ ఛాన్సెలరుగానే తమ మాతృదేశమగు ఇంగ్లాండులో సెలవుపై నుండగానే, వారు భారతప్రభుత్వ విద్యాశాఖాధికారిగ నియమింపబడినను, ఇతరులవలె దీనిపై ఆశచే ప్రేరితులుగాక, తన జబ్బుస్థితిలో అంతగొప్పభారమును మోయలేనేమోయనుసంకోచముచే ఆపనిని మానుకొనియుండిన సంగతి అందరికిని తెలిసినదే. ఏలువురు ఆసంగతి తెలిసినప్పుడు ఇటీవలవారికి ఉస్మానియా విద్యాపీఠ సంబంధమగు అధికారమందు గలిగిన మక్కువ కూడ వారిని దీనికంటె గొప్పదగు భారతప్రభుత్వపు పదవిని వదలుకొనుటకు కొంతవరకు ప్రేరించియుండవచ్చునేమో యని అనుమానించియుండిరి.

మెకంజీగారు ఉస్మానియా విద్యాపీఠపు అధికారము చేపట్టినవెంటనే, వారుచేసిన కొన్ని సంస్కరణములు అంతగా బయటివారికి తెలియకపోయినను వ్యవహారములయందు నిష్పక్షపాతతను, నియమబద్ధతను స్థిరపరచుటకు ఉపకరించినట్లు చెప్పుదురు.

నిజాంరాష్ట్ర ప్రభుత్వాధికారపదవులయందును, ఇతరోద్యోగములయందును బయటివారిని సంపూర్ణముగా నిషేధించుట మంచిదని వారి అభిప్రాయము కాకున్నను, విద్యావిషయములో మాత్రము నిజాంరాష్ట్రవాసులకు బయటివిశ్వవిద్యాలయములతో సంబంధమును ఈరాష్ట్రములో ఎంతమాత్రమును నిలిపియుంచరాదని వారిలక్ష్యమై యుండెను. ఈలక్ష్యముతో నైజాంకాలేజిని మదరాసు విశ్వవిద్యాపీఠమునుండి తొలగించుటకై వారెంతో శ్రమపడిరి; కాని వారి శ్రమ ఫలితమును వారు చూడకముందే ఈలోకమును వదలవలసివచ్చెను.

క్రీ॥ శే॥ మెకంజీగారికి మనరాష్ట్రమందు పేరుసంపాదించిన ముఖ్యకార్యము నిజాంరాష్ట్ర విద్యావిధాన సంస్కరణోద్యమపు అధ్యక్షత్వము. ఈ అధ్యక్షత్వమునందు, విద్యార్థుల మాతృభాషద్వారా విద్యనేర్పించవలెనను సూత్రమును అంగీకరించువిషయములో రాష్ట్రమందలి ముఖ్యసంఘములగు ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకులకు ఎంతవరకు న్యాయముచేకూర్చినదో ఏమో తెలిసికొనుటకు, మెకంజీకమిటీరిపోర్టు ఇంతవరకును ప్రకటించబడలేదు. కాని హైదరాబాదు ఉపాధ్యాయసంఘ వార్షికోత్సవ సందర్భమున విద్యార్థులకు వారల మాతృభాషలోనే విద్య నేర్పవలెనని పట్టుబట్టినవారు, తరువాత ఉర్దూయెడ జూపిన పక్షపాతముచే ఏభాషద్వారా విద్య నేర్పవలెనను విషయమున ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటకులకు సంతృప్తి కలిగించజాలకపోయిరి. అయినను ఇంతమాత్రముచే వారి తక్కిన సేవయొక్క ఘనతను తక్కువ చేయజాలము. గ్రామములలో వ్యవసాయ ప్రధానమగు విద్యను నేర్పించు ఏర్పాట్లు చేయవలెనను విషయమున ఈరాష్ట్రమందలి అభిప్రాయమును చలింపచేయుటకు వారికృషి చాల తోడ్పడినదని ఒప్పుకొనకతప్పదు. మెకంజీగారీ రాష్ట్రమునకు చేసిన కొలదికాలపు సేవలో ఇది చిర స్మరణీయము. ఈసూచనను ఆచరణలో పెట్టునప్పుడు గ్రామస్థుల మాతృభాషలోనే విద్య నేర్పవలెనను సూత్రము నంగీకరించి పనిచేయుచో నుత్తమమగు గొప్పఫలమును సాధించవచ్చును.

మెకంజీగారు ఉస్మానియా విద్యాపీఠ ప్రతిష్ఠను పెంపొందించుటకును, ఈ రాష్ట్రమందు విద్యాసమస్యను సంపూర్ణముగ పరిష్కరించుటకును ఎంతెంతచేయదలచియుండిరో ఏమో! వారు జబ్బుపడి జన్మభూమియందు విశ్రాంతిగైకొనుచుండ, వారింతలో ఈలోకమును వీడుదురని మేమనుకొనియుండలేదు. అందుచే వారికాలగతి మమ్ముల నొకింత శోక విస్మయ స్తబ్ధుల జేసినది. భగవంతుడు వారియాత్మకు శాంతి ప్రసాదించుగాక! వారివియోగముచే దుఃఖమున మునిగియున్న వారి కుటుంబమునకు మా సానుభూతి తెలుపుచున్నాము.

# వకీళ్ల పక్షమున శాసనసభా ప్రతినిధుల ఎన్నిక

## అబ్దుల్లాపాషా, కొండా వేంకటరంగారెడ్డిగార్ల విజయము

(స్వకీయవిలేఖరి)

హైదరాబాదు (దక్కన్) ౨౭ ఆబాన్ ౧౩౪౫ ఫ:—



కొండా వేంకటరంగారెడ్డిగారు

న్యాయవాదులపక్షమున శాసనసభకు ప్రతినిధులఎన్నికలు నేడు హైకోర్టులో జరిగినవి. పండిత కొండా వేంకటరంగారెడ్డిగారు ౩౭౦ వోట్లతోను, మౌల్వి అబ్దుల్లపాషాగారు ౩౮౧ వోట్లతోను గెలిచిరి.

నేడు సరిగా ఉదయం ౧౧ గంటలకు ఎన్నికలు ప్రారంభమయినవి. హైకోర్టుఆంతయు హైకోర్టు వకీళ్లతో క్రిక్కిరిసియుండెను. క్రిందవరలకొలది మోటారుబస్సులు నిలబెట్టబడినవి. కొన్ని కార్లు నాడావుడిగా తిరుగుచుండెను. సరిగా ౧౧ గంటలకు ఎన్నికలు ప్రారంభమైనవి. వోటర్లపట్టిక ద్వారమున వ్రేలాడకట్టబడియుండెను. న్యాయమూర్తి అస్గరయార్ జంగ్ బహద్దరుగారి సమక్షమునయున్న రిజస్టరుపై వోటర్లు అభ్యర్థులకు వోటునిచ్చు సంతకము చేయుచుండిరి.

ద్వారముకడ అభ్యర్థులు తమపేర్లుగల కాగితములను వోటర్లకు యిచ్చుచుండిరి. ఈప్రకారము ఒంటిగంటవరకు జరుగుచునేయుండెను. ఒంటిగంటకు అయిదు నిమిషములు ముందుగానే వోట్లు లెక్కించి ఫలితములకు న్యాయమూర్తిగారు వెల్లడించిరి. మౌల్వి అబ్దుల్లపాషా బి.ఎ.ఎల్.ఎల్.; బి, హైకోర్టు వకీలుగారికి ౩౮౧ వోట్లును, పండిత వేంకటరంగారెడ్డి హైకోర్టువకీలుగారికి ౩౭౦ వోట్లును, ప్రత్యర్థులుగా నిలిచిన ధీరజలాల్ వల్ద్ బన్సీలాల్ గారికి ౧౬ వోట్లును, మౌల్వి సయ్యదు హైదరరజాసా॥ యం.ఏ. బారెట్లాగారికి ౬ వోట్లును మరియిద్దరికి చెరియొకవోటును వచ్చినవని న్యాయమూర్తి ప్రకటించెను. సభ్యులందరు చప్పట్లుకొట్టిరి. వెంటనే గెలుపొందిన అభ్యర్థులు న్యాయమూర్తివద్దకు వచ్చినిలిచిరి. న్యాయమూర్తి గెలిచినవారిని అభినందించుచున్నాననియు, వారు ప్రజలకును ప్రభువునకును మేలుచేయుదురుగాక యనియు నుడివిరి. వెంటనే మౌల్వి అబ్దుల్లాపాషాగారులేచి ప్రజలకును ప్రభుత్వమునకు క్షేమకరమగు శాసనముల గావించుటకు ప్రయత్నించెదనని జవాబుచెప్పిరి.

.. తరువాత శ్రీయుత కొండా వేంకటరంగారెడ్డిగారు ప్రత్యుత్తరమొసగుచు నేను ప్రథమమున యిదివరకున్న సభ్యులు ప్రవేశపెట్టిన చిత్తుశాసనములు శాసనములగునట్లు ప్రయత్నించగలననియు తరువాత ప్రజలకు,ప్రభుత్వమునకు క్షేమకరములగు శాసనములకై ప్రయత్నించెదననియు నుడివిరి. వెంటనే పూలదండలు గెలిచిన అభ్యర్థులకు తండోపతండములుగా వేయబడెను. న్యాయమూర్తికిని,పోలీసుమనుజులకును వేసిరి. కార్యక్రమము ముగించి న్యాయమూర్తిగారు లేచివెళ్లిరి.

క్రిందయున్న లైబ్రరీహాలులో మహబూబునగరము జిల్లా సంఘసభ్యులు జిల్లా ఆంధ్రజనసంఘపక్షమున గెల్చిన అభ్యర్థులను సన్మానించిరి జిల్లాసంఘపు అధ్యక్షులగు యం; నారాయణరావుగారు శ్రీయుతులను అభినందించుచు జిల్లాసంఘసభ్యులు పంపిన ఈక్రింది తీర్మానము చదివిరి.

### తీర్మానము

"న్యాయవాద మహాశయులపక్షమున శాసన సభాసభ్యత్వమునకు అభ్యర్థులుగా నిలిచియున్న శ్రీయుత వెంకటరంగారెడ్డి, మౌల్వి అబ్దుల్లాపాషాగార్లు, రాబోవు రెండు సంవత్సరముల కొరకు సభ్యులుగా ఎన్నుకోబడినందుకు మహబూబునగరంజిల్లా ఆంధ్రసంఘము వారు తమ మనఃపూర్వకమైన అభినందనముల దెలుపుచు దేశీయులకు బీదవారలకు అవసరాన్యుపయోగకరములగు శాసనముల, శాసనసభలో నుపపాదించి, దేశమునకు, ప్రభుత్వమునకును నిజమైన (సేవ చే)యుదురని ఆశించుచున్నారు."

మౌల్వి అబ్దుల్లాపాషాగారు ప్రత్యుత్తరమొసగుచు నేనుయింతకుపూర్వము చెప్పినమాటలనే మరల బలపరచుచున్నాననియు, ప్రజలకు,ప్రభుత్వమునకు క్షేమకరములైన శాసనములకై ప్రయత్నించెదననియు చెప్పికూర్చుండిరి. శ్రీయుత కొండా వేంకటరంగారెడ్డిగారు ప్రత్యుత్తరమొసగుచు యింతకుపూర్వము న్యాయమూర్తి సమక్షమున చెప్పినమాటలనే మరలవిశదీకరించి చెప్పిరి. లోగా కొందరు వోటరులేమి చేసెదరని యడిగినను గెలిచినవో తరువాత సమాధానము చెప్పవచ్చునని యుపేక్షించితినని చెప్పి,తాను మొదట యిదివరకున్న శాసనసభ్యులు ప్రవేశపెట్టిన బిల్లులను శాసనములుగా అవకాశమున్నంతవరకు ప్రయత్నించెద (అవకాశమే చాలతక్కువ) మనిరి. తరువాత ముఖ్యముగా వ్యవసాయదారుల క్షేమమునకవసరములగు శాసనములు కొనుచోటకు ప్రయత్నించెదమని చెప్పి ముగించిరి.

పుష్పమాలలు వేయబడెను. చప్పట్లు మ్రోగెను.

### భోజనపు విందు

నేటిరాత్రి ౮ గంటలకు శ్రీయుత కొండా వేంకటరంగారెడ్డిగారు తాము శాసనసభా సభ్యులుగా నెన్నుకొనబడినందులకుగాను జిల్లాలనుండి ఎన్నికలలో వోట్లనొసగుటకు విచ్చేసిన న్యాయవాదులకు స్థానిక న్యాయవాదులకు, ప్రముఖులకు గొప్ప భోజనపువిందు నొసగిరి. విందునకు సుమారు ౩౦౦ ప్రముఖులు ఆహ్వానింపబడిరి. విందునందు పాల్గొనినవారిలో శ్రీ మాడపాటి హనుమంతరావు, కాశీనాథరావు వైద్య, ఆంధ్ర రామచంద్రరావు, శ్రీనివాసశర్మపురోహిత్, బూర్గుల రామకృష్ణారావు, సుబ్రహ్మణ్యము, ప్రతాపరెడ్డి, మందుముల రామచంద్రరావు, అక్కినేపల్లి జానకిరామారావు, మొదలగువారలు ముఖ్యులు.

సభ్యులతో తనకున్నటువంటి యువకోద్యమంతో అధ్యక్షుడు చేసిన సలహాను సభవారు ఏకగ్రీవముగ నంగీకరించిరి.

మెహరాలీగారు సభను ముగించుచు "ఆంధ్రదేశీయులు శౌర్యపరాక్రమములు గలవారని మేము బొంబాయిలో తెలుసుకొంటిమి. మీ ఆంధ్రయువకుల యున్నారాము. సాహసప్రేమములు నన్ను మరీ ఆకర్షించినవి. వినాగ సంఘీభావముతో ఉద్యమమును నడిపెదరని నమ్ముచున్నానని సభను సమాప్తపరచిరి. అధ్యక్షునికి సభ్యులకును వందనములర్పించుటతో సభదిగ్విజయముగ ముగిసెను.

* * *

## కొవ్విడి లింగరాజుగారి స్వాగతోపన్యాసము

నూతనమైన నాగరికతను స్థాపించడానికి కంకణంకట్టుకొన్న సోదరులందరికీ స్వాగతం. రాజమహేంద్రవరము ఆంధ్రదేశచరిత్రలో విఖ్యాతమైన పట్టణమేకాకుండా నూతనభావాలను స్వీకరించడంలో నూతనోద్యమాలను ప్రోత్సహించడంలోను ఎప్పుడూ ముందంజవేస్తూంది. ఆంధ్రదేశమంతా కూడా నూతనభావాలు రేకెత్తించి క్రొత్త ఆదర్శాశయాలతో ఉజ్జీవింపజేసిన వీరేశలింగంపంతులు రంగభూమి యిది. ఇట్టి సాంప్రదాయసిద్ధమైన యీపట్టణములో మానవకోటి స్వేచ్ఛకోసం నిరంతరకృషి సలిపే మహనీయులు కూడి లోకకళ్యాణానికి తోడ్పడితాయనుటలో ఏమీసందేహంలేదు.

౧౯ శతాబ్దం పరభాగంలో కార్ల్ మార్క్సు! ఎంజిల్సు అనే జర్మనీ శాస్త్రజ్ఞులు ప్రపంచసోషలిస్టుసంయుక్త— అధిభౌతికలక్షణాలను బట్టి సామ్యవాదమును అర్థిక శాస్త్రరీత్యా విశదీకరించారు. అనేకతరాలనుంచి జీవితావసరములను ఉత్పత్తిచేసే సాధనాలన్నీ చేతిలోపెట్టుకొన్న ధనికవర్గానికి కష్టించి పనిచేసే శ్రామికులకూ కలుగుతూవచ్చే సంఘర్షణ పరిణామం కష్టజీవుల ప్రభుత్వస్థాపనమని సిద్ధాంతీకరించారు...... సంఘంలో ప్రతివారు శక్తికొలదిపని చేయకుండా శ్రమపడటం, ప్రతివానికి జీవితావశ్యకమైన సౌఖ్యాలు లభ్యమవడం, సామ్యవాదంయొక్క మూలసిద్ధాంతము ౧౯౧౭ సంవత్సరములో లెనిన్ మహాశయుని నాయకత్వముతో రష్యాలోజరిగిన మహావిప్లవంవల్ల అక్కడ స్థాపింపబడిన కార్మిక కర్షక ప్రభుత్వం ప్రజలను చేయుకలసినలాభంవల్ల ఈసిద్ధాంతం భాగావ్యాప్తి చెందింది. ఒక్కసారిగా ప్రపంచంలోని పాలకప్రజవం మేలుకొని ధనికవర్గంతో పోరాటం సాగిస్తూన్నారు...... మీరటు కుట్రకేసుతో యీఆశయాలు మరీ ప్రబలమైనాయి. రష్యాలో పాలకజన ప్రభుత్వంలోజరిగిన అభివృద్ధిని చూచినపుడు ప్రతిదేశంలోనూకూడా అటువంటిప్రభుత్వాన్ని కాంక్షించేవాళ్లసంఖ్య హెచ్చినది. అసలు యుద్ధానంతరం యూరోపా రాజ్యాంగాల్లో అఖండమైన మార్పులు జరిగిపోయాయి. నిరంకుశచక్రవర్తులెందరో పదచ్యుతులై ప్రజాస్వామికాలు ఏర్పడ్డాయి.

మన రాజకీయాల్లో నేడు సామ్యవాదం ప్రాముఖ్యంవహించడానికి కారకులయినవాళ్లలో జవహర్‌లాలు ముఖ్యుడని చెప్పకతప్పదు. లాహోరు కాంగ్రెసులో జవహర్‌లాలు ఆధ్యర్యమున సంపూర్ణస్వాతంత్ర్య మేభారతవర్షముయొక్క రాజకీయ ఆదర్శమని ప్రకటింపబడినది. ఉత్పత్తిసాధనాలన్నీ ప్రభుత్వం వశపరచుకొనేయుద్దేశంతో ప్రస్తుతంముఖ్యమైన [వస్త్రశాల, రైళ్లు, ఓడలు, గనులు మొదలైనవి] పరిశ్రమలను ప్రభుత్వపరంచేయడం, భూమిపై కృషిచేసే వ్యవసాయదారులకు భూమిహక్కుల నివ్వడం, పాలకప్రజవంయొక్క ఋణాన్నితొలగించడం మొదలైన ముఖ్యాంశములను కాంగ్రెసు అంగీకరించింది. సామ్యవాదసిద్ధాంతాలని ప్రచారంచేయడానికీ కాయకష్టంచేత జీవించే ప్రజలకు అధికారం కల్పించవలెననే ఆదర్శం కాంగ్రెసుచేత అమోదింపచేయడానికి కాంగ్రెసుసోషలిస్టుపార్టీ ౧౯౩౪లోయిలుదేరి కృషిచేస్తోంది. జవహర్‌లాలుగారు తీవ్రసామ్యవాదప్రచారాన్ని చేస్తున్నా. వల్లభాయి పటేలు వంటి పెద్దలింకా సామ్యవాదాన్నిగూర్చి చులకనగా మాట్లాడుతూ నేయున్నారు. సామ్యవాదమంటే రష్యాదేశమునుండివచ్చిన ఒకప్రమాదకరమైన విషయమనిన్నీ, అరష్యాపుస్తకాలు చదివి మనపిల్లలు పాడైపోతున్నారని ఒకవింతైన సంశయం వెలిబుచ్చుతారు. రష్యాలో నూతనపరిశోధన, నూతనయుగము సృష్టింపబడినది ఈసృష్టిలో అనేకలక్షలమంది, బలియైపోయారు. ఏదయినా ప్రజ అన్నవస్త్రాలకై ఆక్రోశించకుండా చేసినది. నిర్వ్యాపిహీనత మహమ్మాన్ని తొలగించింది. రష్యాపుస్తకాలని చదివినంతమాత్రాన అలాటిప్రభుత్వాన్నే ఇండియాలో సృష్టిస్తారనుకొనుట పొరబాటు...ఇంకొక జాతిమీద రాజ్యమేలుతూవున్న పరప్రభుత్వం అతిసులువుగా వదులుతుందనే విశ్వాసం నాకులేదు. ఆ అధికారాన్ని వదులుకొనేటంత ఒత్తిడి తీసికొనిరావాలంటే మనలోఎందరో బలికాకతప్పదు. భారతస్వాతంత్ర్య సంపాదనకు యితరులరక్తం మాటతలబెట్టకపోయినా, మనరక్తం ధారపోయకుండా సాధ్యమౌతుందని నాకునమ్మకం లేదు...దేవుడు కానివ్వండి మతంకానివ్వండి అది వ్యక్తికి సంబంధించినవిషయం. కాని దేవాలయాలపేరిట, చర్చీలపేరిట, ఆయా మతాధిపతులపేరిట జరిగే అత్యాచారాలని దోపిళ్లని సామ్యవాదంసహించదు. ఈమతాలు ఈ మతసంస్థలు సామ్రాజ్యవాదానికి ఉపాంగాలుగా ఉంటే సామ్యవాదులు వాటినివాటిపోక తప్పదు...నాలభిన్నమైనమతాలు సంఘాలు కులాలున్నాయనీ మనలోమనకు ఐకమత్యంకలగదనీ మైగామనదేశంలో చాలాకాలంద సాచారాలు మూఢత్వంఉండడంచేత యీగడ్డమీద సామ్యవాదం వ్యాప్తిచెందదనిన్ని కొందరుచెబుతారు. ఈసంఘాలకులాలు కృత్రిమ సృష్టిఅని నమ్ముతుంది. ప్రపంచంలో ఏదేశంలోనైనా రెండేజాతులున్నాయి. ధనికుల—పేదలు. అంటే పెట్టుబడిదారులు శ్రామికులు. ఈ జాతులమధ్యకలిగేసంఘర్షణ రూపాంతరములే, యీజాతులమధ్య కలిగేసంఘర్షణరూపాంతరములే యీవిశ్వామిత్రసృష్టికి కారణాలు. భూస్వాములు, శ్రమజీవులు యీరహస్యాన్ని గుర్తించినపుడు విప్లవంరాకతప్పదు. అప్పుడీభేదాలన్నీ నశించిపోతాయి......ఈసభ ఉరుములు మెరుపులమధ్యజరుగుతోంది. యూరోపువాతావరణమంతా యుద్ధచిహ్నాలతో నిండిఉంది. ఏరోజున ప్రపంచయుద్ధం ప్రారంభింపబడుతుందో చెప్పలేము సామ్రాజ్యతత్వము కోసం జరిగే ఏ యుద్ధానికి మనం సాయపడకూడదు...సోదరులాలా! మనదేశంలో కర్షకజనాన్ని కృశింపచేసె మహాఆనర్థాలో జమీందారీపద్ధతి ఒకటి. జమీందారులు, భూస్వాములుఏకమై తమకున్న అర్థబలాన్ని, అధికారబలాన్ని ఏకోన్ముఖం చేసికొని కాంగ్రెసును ధ్వంసంచేయడానికి సమకట్టారు. జమీందారుల జబర్దస్తీ భూస్వాముల బుకాయింపుపోవాలి...మనపార్టీ బలపడాలంటే కార్మికసంఘాలు అన్నిచోట్లా ఏర్పడాలి. ప్రజాసామాన్యంలో మనఆశయాలు వ్యాపించాలి.

---

## గోలకొండ కవులసంచిక

| | | | |
|---|---|---|---|
| చందాదారులకు | వెల | రు | ౧-౦-౦ |
| ఇతరులకు | ,, | ,, | ౨-౦-౦ |

తనమాతృభాషాజ్ఞానము లేని భారతీయుని ఏమనవలెను? అతనిని భారతీయుడని చెప్పదగునా???

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు
నిజాంరాష్ట్రపు ఎనిమిది జిల్లాలలోని ఆంధ్రులలో మీవర్తకవృద్ధికి సాధనము? గోలకొండ పత్రికలో ప్రకటనము.

Vol. 11. | Thursday 8—10—1936 | No. 44


హరికథా పితామహ

## ఆదిభట్ల నారాయణదాసుగారు

వ్యాసకర్త:
(సుసర్ల శ్రీరామనృసింహంగారు)

విశాఖపట్టణంజిల్లా పేరుచెప్పినప్పటికిని మహామహులు జన్మించిన ప్రదేశము. పూర్వము గంజాంజిల్లా ఆంధ్రభాగముతో కలిపిన (నేటివిశాఖమండలముతో) మొత్తం ఈకళింగసీమకు విజయనగరము విద్యాపీఠముగ నుండెడిది. వైదిక విద్యలలో పేరెన్నికగన్న మహాపండితులు విజయనగర సంస్థానాధిపతులచే పోషింపబడుచు వచ్చిరి. విజయరామగజపతి, ఆనందగజపతి మహారాజులకాలములో మొదటితరగతి కళాశాల స్థాపింపబడి యభివృద్ధిగాంచెను. అనగా కళింగసీమలో ముఖ్యులైన మహామహులందరు విజయనగరములోనే పట్టభద్రులయిరి. నేటికిని మద్రాసురాజధాని కళాశాలలలో విజయనగరం కళాశాల ప్రాముఖ్యస్థాన మలంకరించుచున్నది. అందుచేతనే కీ॥ శే॥ సర్, ఒయ్యూరునరసింహేశ్వరశర్మ, (మైసూరుమంత్రిగా నుండెను.) శ్రీయుతులు చిర్రావూరి యజ్ఞేశ్వరచింతామణి. సర్. వేపా రామేశంపంతులు, కొంతి వెంకటరామమూర్తిపంతులు, ఒసవన్న రామచంద్రరావు [కలకత్తా], చింతకింది వెంకటహనుమంతరావు [లాహోరు విశ్వవిద్యాలయ గణితాధ్యాపకులు] బ్రహ్మశ్రీ దివాకర్ల యేచూరి నరసింహం పంతులు, మహామహోపాధ్యాయ, తాతా సుబ్బరాయశాస్త్రి, వైణికాచార్య హరికథా పితామహ ఆదిభట్ల నారాయణదాసు, వీణరమణయ్యదాసు, మహాబలశాలి కోడిరామమూర్తినాయుడు, ద్వారం వెంకటస్వామినాయుడు [వీణాప్రవీణుడు] మున్నగు పెద్దలీమండలమువారే.

మన వ్యాసనాయకుడు శ్రీఆదిభట్ల నారాయణదాసుగారు విశాఖపట్నంజిల్లా బొబ్బిలితాలూకా అజ్జాడగ్రామమున శ్రీరక్తాక్షిసంవత్సర శ్రావణబహుళ ౧౨తే బుధవారంరాత్రి మఖానక్షత్రవృషభలగ్నమందు ఒక ప్రసిద్ధపండితవంశమున జన్మించిరి. వీరు కోనసీమద్రావిడ శాఖీయులు, వీరితండ్రిగారు సంస్కృత పండితుడు కవికూడను. తల్లి తెలుగులో పండితురాలు. వీరకుటుంబమువారు యజ్ఞయాగాది క్రతువులాచరించియుండిరి. అన్నప్రదానమునకు పేరొందియుండెనట. అగ్రహారికులై యుండుటచేత సహజముగ స్థితివంతులు. తండ్రిగారు పురాణములు చదువుచున్నతరి ప్రక్కనకూర్చొని అక్షరములను గుర్తుపట్టి అక్షరాభ్యాసము కాకముందే దాసుగారు తెలుగుభాగవతమును చదువగలిగిరి. [అప్పటికి వ్రాయుటతెలియదు] వీరిబాల్యములో విద్యాభ్యాసము యింటిలోనే జరిగియుండెను. అయిదవయేటనుండియు అదనము పాడను సహజముగవచ్చినది. దాసుగారికి ఆరవయేట ఉపనయనముజరిగినది. అంతటినుండి పదకొండవ సంవత్సరమువచ్చునరకు తండ్రివద్దనే కొన్నిగ్రంథములు వేదము మరియు గీర్వాణసాహిత్యగ్రంథములు చదివిరి. ౧౨వ యేట తమఅన్నగారు విజయనగరం తీసికొనివచ్చిరి ౧౨వయేటనుండి ౧౫ యేటివరకు పురాణపఠనమువలన విద్యసంపాదింప మొదలిడిరి. కాని ౧౫ సం॥లో విజయనగరములోనే ఇంగ్లీషుఫస్టుక్లాసులో ప్రవేశించిరి. తనయొక్కతెలివితేటలవలన మధ్యమధ్య కొన్నితరగతులు చదువనక్కరలేకుండగనే మెట్రిక్యులేషను పొందుటకు ౨౧ సం॥లలో అనగా ౨౧వయేట మెట్రిక్యులేషను ప్యాసైరి. పదునెనిమి[illegible]యేటనుండి యు స్వతంత్రముగ హరికథలు చెప్పుచుండుట ప్రారంభించిరి. తెలవులలో [illegible] యము చెప్పుట, పల్లవిపాడుట జరుగు[illegible]డెడిది.

౧౮ సం॥లో వివాహమాయెను. ౧౮౮౨-౮౩ సం॥లలో ఎఫ్.ఏ. క్లాసుచదివిరి. విద్యావేతనము లభించియుండెను. ఎఫ్.ఏ. పరీక్షలో లెక్కలలో తప్పిపోయెను. అంతటితో విద్యనుచాలించిరి.

నారాయణదాసుగారి రచనలు గణనీయమైనవి. వీరుతొలుత రచించినహరికథ ధ్రువోపాఖ్యానము. [అచ్చుకాలేదు] తర్వాత శ్రీకృష్ణజననమను సంస్కృతహరికథను వ్రాసిరి. ౨౮ సం॥లో గజేంద్రమోక్షమను హరికథ రచనజరిగెను. ౨౯లో సారంగధర నాటకమును వ్రాసిరి. నవరసతరంగిణియను పేరుతో కాళిదాస మహాకవియొక్కయు, షేక్స్పియరను మహాకవియొక్కయు రసవత్తరమైన ఘట్టములను తెలుగులోనికి పద్యరూపముగమార్చ ప్రయత్నించిరి. ఈసప్ఫేబిల్సు — వందకథలను “నూర్గంటి” గ్రంథరూపకముగ తెలుగుపద్యగద్యలలో ప్రకటించిరి. ౨౭ సం॥లో మార్కండేయోపాఖ్యానం హరికథనచ్చు అచ్చువేయించిరి. ౩౦ సం॥లో మైసూరుకువెళ్లి శ్రీమహారాజావారి ప్రాపకమున వారికర్తాంగులో మూడురోజులు దాసుగారు తమపాండిత్య ప్రకర్ష ప్రదర్శించిరి. అప్పుడు మహారాజావారు దాసుగారికి బంగారుతోడాలును వీణను బహుమానముగానిచ్చియుండిరి. మద్రాసులో ప్రచురింపబడు “హిందూ” “మెయిలు” పత్రికలు నారాయణదాసుగారి మైసూరు సన్మానమునుగూర్చి విశేషముగా ప్రకటించెను. అందుపై విజయనగరం మహారాజా ఆనందగజపతి దాసుగారినివారి ఆస్థానపండితునిగా నియమించిరి. దాసుగారు వారి ౩౧వయేట హరిశ్చంద్రోపాఖ్యానము, ౩౨లో రుక్మిణీకళ్యాణము. ౩౩లో ప్రహ్లాదోపాఖ్యానము, ౩౫లో సావిత్ర్యుపాఖ్యానము, ౪౦లో భీష్మచరిత్ర హరికథలుగా రచించిరి. ౪౨లో తారకమను సంస్కృతకావ్యమును, సూర్యనారాయణశతకం. శివశతకం. ముకుందశతకం, సత్యవ్రతశతకం—వీటిని తెలుగులోరచించిరి. ౫౨లో యథార్థరామాయణమును హరికథనుచేసిరి. ఈరామాయణమునే హరిదాసులందరును ఆంధ్రదేశమంతటిలోను నేటికిని ఎక్కువగా హరికథగా చెప్పుచుందురు. భాగవతదశమస్కంధమును హరికథామృతమను పేరుతో సంస్కృతమున వ్రాసిరి. ఏబదిఆరవయేట విజయనగరసంగీత కళాశాలాధ్యక్షులుగా నియమింపబడిరి. ౫౭లో విష్ణుసహస్రనామమును “వెన్నెలపెయ్యిపేర్లవినుకలి” పద్యప్రబంధమును వ్రాసిరి. “పేల్పుమాటలు” యను పద్యగ్రంథమును భగవద్గీతాసారముగ వ్రాసిరి. ౬౦ సం॥ ప్రాంతములో ౩౧౧ ఋగ్వేదమంత్రములకు తాత్పర్యములనేర్పరచి, అచ్చతెలుగు పద్యములతర్జుమాతో సమాప్తముచేసిరి. దీనిపేరు ఋక్సంగ్రహము.

నిరి. ౬౩లో “ఉమర్ ఖయామ్” అను పారసీక గ్రంథమునకు సంస్కృతములోనికిని తెలుగులోనికిని తర్జుమాచేసిరి. దాసుగారి ౭౨ సం॥లో సంస్కృత కళాశాలాధ్యక్షతనుండి విశ్రాంతినొందిరి.

వీరిశిష్యగణము మిక్కిలి అధికముగా ఆంధ్రావని యంతటిలోనుయున్నది. నారాయణదాసుగారివద్దనే చదువుకొనినశిష్యులు నూరుమందియుందురు. శిష్యులశిష్యులు నారిపరంపర మొత్తము వెయ్యిమందికి పైగా త్రిలింగదేశములో చూడగలము. వీరిలో దాసుగారిచరిత్రను వర్ణించి పరోక్షముగా యీహరికథాపితామహుని ప్రధానగురువుగా భావించువారుకూడ యుందురు. దాసుగారిశిష్యులలో ప్రముఖులుగా నున్నవారిపేర్లను యుదహరించుట సందర్భముగనే యుండును.

| | | |
|---|---|---|
| ౧. | ఆదిభట్ల నరసింహదాసు | విజయనగరం |
| ౨. | వేదవభట్ల రమణయ్యదాసు | ,, |
| ౩. | కర్రా జగన్నాథదాసు | ,, |
| ౪. | పద్మనాని నరసింహదాసు | ,, |
| ౫ | వేమాని వరహాలదాసు | ,, |
| ౬. | శిగడం అచ్చన్నదాసు | ,, |
| ౭. | లంక అప్పలదాసు | ,, |
| ౮. | కరుపూరి కృష్ణమూర్తిదాసు | ,, |
| ౯. | చెరుకుపల్లి కనకమ్మదాసు | ,, |
| ౧౦ | సిద్దుల మల్లికార్జునదాసు | ,, |
| ౧౧. | చిట్టిమళ్ల రంగయ్యదాసు | ,, |
| ౧౨. | గోకా వెంకట రమణదాసు | మాడుగుల (విశాఖజిల్లా) |
| ౧౩. | వాజపేయాజుల సుబ్బయ్యదాసు | ఉంగటూరు (ప. గో) |
| ౧౪. | నేతి లక్ష్మీనారాయణదాసు | నూతక్కి (గుంటూరుజిల్లా) |
| ౧౫. | రాకంటి జగన్నాథదాసు | శ్రీకాకుళం (విశాఖజిల్లా) |
| ౧౬. | బంకా బాలకృష్ణదాసు | బెజవాడ |
| ౧౭. | పుచ్చల బసవదాసు | రాజమండ్రి |

ఇంకను ఎందరో ప్రజ్ఞావంతులైన హరిదాసులున్నారు పైనవ్రాయబడిన శిష్యులలోకూడ సామర్థ్యతలో హెచ్చుతగ్గులను పాటించలేదు. నారాయణదాసుగారు బ్రాహ్మణ బ్రాహ్మణేతర విచక్షణచేయకుండగనే వచ్చినవారికెల్లవిద్యను చెప్పియుండిరి. పైన ఉదహరింపబడిన ప్రముఖులపేర్లకు దాసుఅనియే హరికథా పితామహుని తెలవుప్రకారము వ్రాసియుంటిని కాని నేడు ఆంధ్రావనిలో హరిదాసులందరును “భగవతార్” అని పిలిపించుకొనుచున్నారు. ఈశబ్దము భాగవతులు అనుమాటకు అరవపదము. చివర “ర్” అని చేర్చుట తమిళములో గౌరవవాచకమగును. “అయ్య” అను తెలుగుమాటకు ప్రతి “అయ్యర్” అరవములో

భారతవర్షమంతటిలోను గణనీయమైన ఆంధ్ర పుత్రరత్నములలో ఆదిభట్ల నారాయణదాసు గారొకరు. హరికథను ఒకకళగాను ఉద్యమముగాను చేసి దానిని యావదాంధ్రభూమికిని వ్యాపింపజేసిన మహనీయుడు నారాయణదాసుగారు. దాసుగారు ఆంధ్రగీర్వాణ పారసీకాంగ్ల భాషలలో పండితుడు. స్వతంత్రప్రజ్ఞకల కవీశ్వరుడు గాయకుడు నటకుడు. ఇన్నిప్రజ్ఞలుకల హరిదాసు భారతావనిలో కలడాయనిసందేహముతోచును. దాసుగారు నిర్దుష్ట్యపురుషుడు నిరంకుశగంభీరుడు. పూర్వకాలములో హరికథ ఏ మగనుండెనో మనకు తెలియదుకాని ఆకాలములో నారాయణదాసు ఆంధ్రమున క్రొత్తసృష్టి చేసియుండెనని చెప్పవచ్చును. ఆంధ్రావనిలో ప్రతప్రాంతమునకును వెడలి తమ ఆగమ్యతమును వెదజల్లినారు. దాసుగారి హరికథలను ఎచటనైనను వేలసంఖ్యమీదనే శ్రోతలు వచ్చుచుందురు. అనేకమంది మహారాజులచేత, జమీందారులచేత, ఐశ్వర్యవంతులచేత విద్యావంతులచేత దాసుగారు పొగడబడి బహుమానములను పొందియుండిరి. దాసుగారు మహాభోగి విలాస పురుషుడు. అమిత స్వాతంత్ర్యపరుడు. త్యాగము ప్రబోధించుటలోనే కాని ఆచరణములోనున్నట్లులేదు. ఈయన రమారమి లక్షరూపాయిలు నార్జించియుండును. ఈ ఎనుబదవపడిలోకూడ హరికథలకు పోవుచునేయుండును. నృత్యము చేయుట మానలేదు. ఆంధ్రావనిలో ఒక ఉద్యమమును సృష్టించి పోషించి వ్యాపింపచేసిన మహామహుడు నారాయణదాసుడు.

———

శ్రీమతి వడ్డకొండ ఇందిరాదేవి
బాలికల ఉన్నతపాఠశాల విద్యార్థిని
“ఘోషయాత్ర” యనుచక్కని
నాటకమును రచించిన
కవయిత్రి.


Printed and Pub[illegible]ed by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor K. Balakrishna Reddy.